# 'లక్ష్మి' అనగా ఎవరు ?

నేటి లోకప్రచలితమైన పురాణములను బట్టి క్షీరసాగర మథనమున జనించి విష్ణుదేవునకు పత్నియైన ఒక స్త్రీ దేవత లక్ష్మి. ఆమె సమస్త ఐశ్వర్యములకు స్వామిని, నాలుగు చేతులు కలిగి తన భక్తుల నైశ్వర్యములతో నాశీర్వదించుచుండు వరదాయిని. కాని, మన ప్రాచీన వైదిక సాహిత్య కథనము యిందుకు భిన్నముగా నుండును. ఎలనన -

'లక్ష్మి పదము - 'లక్ష-దర్శనాం జ్కనయోః' అను సంస్కృత మూల ధాతువు (Root) తొ నిర్మితమైనది. కాన మూలార్థమును బట్టి దర్శించునది, దర్శింపబడునది, దర్శించ దగినది' అను అర్థములు వచ్చును. సమస్త బ్రహ్మాండములను, అందలి సమస్త స్థూల సూక్ష్మ ద్రవ్యములను, ప్రాణులను దర్శించగల శక్తి కేవలము సృష్టి స్థితి లయముల గావించు పరమాత్మునికే ఉన్నది. కానరాని అత్యంత సూక్ష్మమైన ప్రకృతిని (పరమాణువులను) తన అనంత జ్ఞాన సామర్థ్యములతో దర్శింపబడు ఈ ప్రపంచముగా నిర్మించినవాడు కూడా అతడే. కాన ఈ లక్ష్మి పదము ముందుగా పరమేశ్వరునకే వర్తించును. అందుచేతనే మహర్షులు లక్ష్మిపదమును ఈ క్రింది విధముగా నిర్వచించిరి.

# 'లక్ష్మి' అనగా ఎవరు ?

నేటి లోకప్రచలితమైన పురాణములను బట్టి క్షీరసాగర మథనమున జనించి విష్ణుదేవునకు పత్నియైన ఒక స్త్రీ దేవత లక్ష్మి. ఆమె సమస్త ఐశ్వర్యములకు స్వామిని, నాలుగు చేతులు కలిగి తన భక్తుల నైశ్వర్యములతో నాశీర్వదించుచుండు వరదాయిని. కాని, మన ప్రాచీన వైదిక సాహిత్య కథనము యిందుకు భిన్నముగా నుండును. ఎలనన -

'లక్ష్మి పదము - 'లక్ష-దర్శనాం జ్కనయోః' అను సంస్కృత మూల ధాతువు (Root) తొ నిర్మితమైనది. కాన మూలార్థమును బట్టి దర్శించునది, దర్శింపబడునది, దర్శించ దగినది' అను అర్థములు వచ్చును. సమస్త బ్రహ్మాండములను, అందలి సమస్త స్థూల సూక్ష్మ ద్రవ్యములను, ప్రాణులను దర్శించగల శక్తి కేవలము సృష్టి స్థితి లయముల గావించు పరమాత్మునికే ఉన్నది. కానరాని అత్యంత సూక్ష్మమైన ప్రకృతిని (పరమాణువులను) తన అనంత జ్ఞాన సామర్థ్యములతో దర్శింపబడు ఈ ప్రపంచముగా నిర్మించినవాడు కూడా అతడే. కాన ఈ లక్ష్మి పదము ముందుగా పరమేశ్వరునకే వర్తించును. అందుచేతనే మహర్షులు లక్ష్మిపదమును ఈ క్రింది విధముగా నిర్వచించిరి.

"యో లక్షయతి పశ్యత్యఙ్కతే చిహ్నయతి చరాచర జగదథవా రాప్తైర్యోగిభిశ్చ యో లక్ష్యతే స లక్ష్మీః సర్వప్రియ ఈశ్వరః" మహర్షి దయానందుడు ఈ నిర్వచనమును వివరించుచు - చరాచరమగు సమస్త జగత్తును జూచువాడు, దృశ్యముగా జేయువాడు. శరీరమందు కన్ను, ముక్కు మొదలగువానిని, వృక్షములందలి పత్రపుష్ప మూలములను, భూజలముల నలుపు ఎరుపు తెలుపులను, మృత్తికా పాషాణ చంద్ర సూర్యాది దృశ్యములనుజేయువాడును, అన్నిటిని జూచువాడును, సుందరము లన్నిటిలో అతి సుందరము, వేదాది శాస్త్రములకును, ధార్మికులు విద్వాంసులునగు యోగులకు లక్ష్యమును - చూచుటకు యోగ్యుడు నగుటచే పరమేశ్వరునకు 'లక్ష్మీ యని పేరు' అని తన ప్రసిద్ధ 'సత్యార్థ ప్రకాశము'న తెలిపిరి. ఐశ్వర్యము లన్నిటికి మూలకారణమగు సమస్త విద్యా విజ్ఞాన భండారమైన వేదముల నుత్పన్నము చేసినవాడు కూడ పరమేశ్వరుడే గాన ఈ పదమునకు ఆధ్యాత్మికార్థ మియ్యదియే.

ఆధి భౌతికముగ అనగా ప్రాణుల పరముగా లక్ష్మిగల ఐశ్వర్య వంతులకు, రాజులకు ఈ పదము వర్తించును. ఇక ఆధి దైవికార్థముగా అనగా జడదేవతల పరంగా అర్థము చెప్పుకొన్న దర్శించ తగినది, సుందరమైనది అందరికి మనోరంజకమైనది ఐశ్వర్యము గాకున్న మరేముండును ? కాన భౌతిక సిరి సంపదల

నన్నిటిని లక్ష్మి అనవచ్చును. లక్ష్మి అనగా ధన కనక వస్తు వాహనములే గాక గో అశ్వగజ రాజ్యాదులన్నియు వచ్చును. ఈ లక్ష్మీ సూక్తమునందు ఐశ్వర్య లక్ష్మి కొఱకు జాతవేద భగవానుని ప్రార్థించుట గలదు. మరి

## ఈ 'జాతవేదు' డెవరు ?

'జాతవేదు' డనగా జన్మించినవాని నన్నిటిని ఎఱిగినవాడని అర్థము. పుట్టిన ప్రతిప్రాణినే గాక ఈ సమస్త బ్రహ్మాండములను, సమస్త గ్రహగోళములను, అందలి సమస్త పదార్థములను యథార్థముగా ఎరిగినవాడని గ్రహించవలెను. ఏలనన అవియన్నియు పుట్టినవే - పరమాణువులతో నిర్మింపబడినవే. వీటన్నిటిని ఎరుగగలవాడు పరమేశ్వరుడు కాకున్న మరెవ్వరుండురు? అందుచే సర్వవ్యాపకుడై జీవులకొఱకు సదా సృష్టి స్థితి ప్రళయముల చేయుచు, మానవులు తమ మనోవాక్కాయములతోచేయు సమస్త కర్మలకు న్యాయముగా తగు ఫలముల నిచ్చు పరమేశ్వరుననే జాతవేదు డని పేరు.

సృష్టిక్రమములో చివరి ప్రాణిగా పరమేశ్వరుడు మానవులను సృజించి వారికి బుద్ధియను ఒక గొప్ప అంతరింద్రియము నిచ్చెను. దానికి విషయముగా వేదముల ద్వారా జ్ఞానము నిచ్చెను. ఏ కర్మల

"యో లక్షయతి పశ్యత్యఙ్కతే చిహ్నాయతి చరాచర జగదథవా రాప్తైర్యోగిభిశ్చ యో లక్ష్యతే స లక్ష్మీః సర్వప్రియ ఈశ్వరః" మహర్షి దయానందుడు ఈ నిర్వచనమును వివరించుచు - చరాచరమగు సమస్త జగత్తును జూచువాడు, దృశ్యముగా జేయువాడు. శరీరమందు కన్ను, ముక్కు మొదలగువానిని, వృక్షములందలి పత్రపుష్ప మూలములను, భూజలముల నలుపు ఎరుపు తెలుపులను, మృత్తికా పాషాణ చంద్ర సూర్యాది దృశ్యములనుజేయువాడును, అన్నిటిని జూచువాడును, సుందరము లన్నిటిలో అతి సుందరము, వేదాది శాస్త్రములకును, ధార్మికులు విద్వాంసులునగు యోగులకు లక్ష్యమును - చూచుటకు యోగ్యుడు నగుటచే పరమేశ్వరునకు 'లక్ష్మీ యని పేరు' అని తన ప్రసిద్ధ 'సత్యార్థ ప్రకాశము'న తెలిపిరి. ఐశ్వర్యము లన్నిటికి మూలకారణమగు సమస్త విద్యా విజ్ఞాన భండారమైన వేదముల నుత్పన్నము చేసినవాడు కూడ పరమేశ్వరుడే గాన ఈ పదమునకు ఆధ్యాత్మికార్థ మియ్యదియే.

ఆధి భౌతికముగ అనగా ప్రాణుల పరముగా లక్ష్మిగల ఐశ్వర్య వంతులకు, రాజులకు ఈ పదము వర్తించును. ఇక ఆధి దైవికార్థముగా అనగా జడదేవతల పరంగా అర్థము చెప్పుకొన్న దర్శించ తగినది, సుందరమైనది అందరికి మనోరంజకమైనది ఐశ్వర్యము గాకున్న మరేముండును ? కాన భౌతిక సిరి సంపదల

నన్నిటిని లక్ష్మీ అనవచ్చును. లక్ష్మీ అనగా ధన కనక వస్తు వాహనములే గాక గో అశ్వగజ రాజ్యాదులన్నియు వచ్చును. ఈ లక్ష్మీ సూక్తమునందు ఐశ్వర్య లక్ష్మీ కొఱకు జాతవేద భగవానుని ప్రార్థించుట గలదు. మరి

## ఈ 'జాతవేదు' డెవరు ?

'జాతవేదు' డనగా జన్మించినవాని నన్నిటిని ఎఱిగినవాడని అర్థము. పుట్టిన ప్రతిప్రాణినే గాక ఈ సమస్త బ్రహ్మాండములను, సమస్త గ్రహగోళములను, అందలి సమస్త పదార్థములను యథార్థముగా ఎరిగినవాడని గ్రహించవలెను. ఏలనన అవియన్నియు పుట్టినవే - పరమాణువులతో నిర్మింపబడినవే. వీటన్నిటిని ఎరుగ గలవాడు పరమేశ్వరుడు కాకున్న మరెవ్వరుందురు? అందుచే సర్వవ్యాపకుడై జీవులకొఱకు సదా సృష్టి స్థితి ప్రళయముల చేయుచు, మానవులు తమ మనోవాక్కాయములతోచేయు సమస్త కర్మలకు న్యాయముగా తగు ఫలముల నిచ్చు పరమేశ్వరుననే జాతవేదు డని పేరు.

సృష్టిక్రమములో చివరి ప్రాణిగా పరమేశ్వరుడు మానవులను సృజించి వారికి బుద్ధియను ఒక గొప్ప అంతరింద్రియము నిచ్చెను. దానికి విషయముగా వేదముల ద్వారా జ్ఞానము నిచ్చెను. ఏ కర్మల

వలనమానవులు ఇహలోక పరలోకములందు ఉన్నతి చెందగలరో ఆ వేదముల ద్వారా ఉపదేశించెను. అందు ఐశ్వర్యప్రాప్తికి వలయు ఎన్నెన్నో విద్యలను, విజ్ఞాన విషయములను తెలిపెను. సోమరి తనమును విడిచి పూర్ణపురుషార్థముతో 'శతహస్త సమాహర - సహస్ర హస్త సంకిర' - నూరు చేతులతో సంపాదించి - వెయ్యి చేతులతో వితరణ చేయమని ప్రబోధించెను. అనగా శతవిధాల ధర్మమార్గమున ఐశ్వర్యములను సంపాదించి, సహస్ర విధాల ధర్మకార్యములందు వినియోగించి పుణ్యము నార్జించుమని అర్థము. కాని, ఆ సంపాదన, వితరణలు ధర్మమార్గమున జరుగుకున్న ఆ లక్ష్మి 'భద్రా లక్ష్మీ' కాదు. పాపీ లక్ష్మి యగును. ఆ పాపీ లక్ష్మీ ఈ జన్మలో కాకున్నను రాబోవు జన్మలలోనైన మిమ్ము కష్టములపాలు చేయక విడువదు. 'తస్మాత్ జాగ్రత !' అని హెచ్చరించెను.

కాన, వేదోక్త ధర్మమార్గమున పూర్ణపురుషార్థము చేసి భద్రా లక్ష్మిని బొందుదము రండు. అట్టి శక్తి యుక్తులను, పురుషార్థ ప్రేరణను కలిగించమని మహర్షులు సూచించిన 'లక్ష్మీ సూక్త మంత్రము లతో జాతవేద పరమేశ్వరుని ప్రార్థింతము రండు.

# అథ లక్ష్మి సూక్తమ్

**ఓ3మ్ హిరణ్య వర్ణాం హరిణీం, సువర్ణ రజతస్రజామ్ ।**

**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (1)**

భా.అ. : ఓ జాతవేద పరమేశ్వర! సర్వవస్తు ప్రదాత! సర్వవ్యాపక సర్వేశ్వర! బంగారు వర్ణముతో నొప్పారునదియు, దర్శనమాత్రమున సర్వజనుల చిత్తము నాకర్షించునదియు, సువర్ణ రజిత మాలాలంకృతయు,, ఆహ్లాదము నిచ్చునదియు, హిరణ్మయియు నగు లక్ష్మిని - ఐశ్వర్యమును నాకు ప్రసాదింపుము.

**ఓ3మ్ తాం మ ఆ వహ జాతవేదో లక్ష్మి మనపగామినీమ్ ।**

**యస్యాం హిరణ్యం విందేయం, గామశ్వం పురుషానహమ్॥ (2)**

భా.అ. : ఓ జాతవేద! ఐశ్వర్యదాత! ఈశ్వర! నన్నెన్నటికి విడువని గో అశ్వ సంపదలను, సుసంతానమును, పుష్కల సువర్ణాది సంపదలను నాకు ప్రసాదింపుము.

**ఓ3మ్ అశ్వపూర్వాం రథమధ్యాం, హస్తినాద ప్రమోదినీమ్ ।**

**శ్రియం దేవీ ముప హ్వయే, శ్రీర్ మాదేవీర్ జుషతామ్ ॥ (3)**

భా.అ. : ఓ జాతవేద! భగవన్! వాయు వేగముగల అశ్వములతోను, అతిరథ మహారథులచే శోభిల్లుచుండు రథములతోను, మద గజముల ఘీంకారములతోను కూడిన రాజ్యలక్ష్మిని నాకు

వలనమానవులు ఇహలోక పరలోకములందు ఉన్నతి చెందగలరో ఆ వేదముల ద్వారా ఉపదేశించెను. అందు ఐశ్వర్యప్రాప్తికి వలయు ఎన్నెన్నో విద్యలను, విజ్ఞాన విషయములను తెలిపెను. సోమరి తనమును విడిచి పూర్ణపురుషార్థముతో 'శతహస్త సమాహర - సహస్ర హస్త సంకిర' - నూరు చేతులతో సంపాదించి - వెయ్యి చేతులతో వితరణ చేయమని ప్రబోధించెను. అనగా శతవిధాల ధర్మమార్గమున ఐశ్వర్యములను సంపాదించి, సహస్ర విధాల ధర్మకార్యములందు వినియోగించి పుణ్యము నార్జించుమని అర్థము. కాని, ఆ సంపాదన, వితరణలు ధర్మమార్గమున జరుగుకున్న ఆ లక్ష్మి 'భద్రా లక్ష్మీ' కాదు. పాపీ లక్ష్మి యగును. ఆ పాపీ లక్ష్మీ ఈ జన్మలో కాకున్నను రాబోవు జన్మలలోనైన మిమ్ము కష్టములపాలు చేయక విడువదు. 'తస్మాత్ జాగ్రత !' అని హెచ్చరించెను.

కాన, వేదోక్త ధర్మమార్గమున పూర్ణపురుషార్థము చేసి భద్రా లక్ష్మిని బొందుదము రండు. అట్టి శక్తి యుక్తులను, పురుషార్థ ప్రేరణను కలిగించమని మహర్షులు సూచించిన 'లక్ష్మీ సూక్త మంత్రము లతో జాతవేద పరమేశ్వరుని ప్రార్థింతము రండు.

# అథ లక్ష్మీ సూక్తమ్

**ఓ౩మ్ హిరణ్య వర్ణాం హరిణీం, సువర్ణ రజతస్రజామ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (1)**

భా.అ. : ఓ జాతవేద పరమేశ్వర! సర్వవస్తు ప్రదాత! సర్వవ్యాపక సర్వేశ్వర! బంగారు వర్ణముతో నొప్పారునదియు, దర్శనమాత్రమున సర్వజనుల చిత్తము నాకర్షించునదియు, సువర్ణ రజిత మాలాలంకృతయు,, ఆహ్లాదము నిచ్చునదియు, హిరణ్యమయియు నగు లక్ష్మిని - ఐశ్వర్యమును నాకు ప్రసాదింపుము.

**ఓ౩మ్ తాం మ ఆ వహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం విందేయం, గామశ్వం పురుషానహమ్॥ (2)**

భా.అ. : ఓ జాతవేద! ఐశ్వర్యదాత! ఈశ్వర! నన్నెన్నటికి విడువని గో అశ్వ సంపదలను, సుసంతానమును, పుష్కల సువర్ణాది సంపదలను నాకు ప్రసాదింపుము.

**ఓ౩మ్ అశ్వపూర్వాం రథమధ్యాం, హస్తినాద ప్రమోదినీమ్ ।**
**శ్రియం దేవీ ముప హ్వయే, శ్రీర్ మాదేవీర్ జుషతామ్ ॥ (3)**

భా.అ. : ఓ జాతవేద! భగవన్! వాయు వేగముగల అశ్వములతోను, అతిరథ మహారథులచే శోభిల్లుచుండు రథములతోను, మద గజముల ఘీంకారములతోను కూడిన రాజ్యలక్ష్మిని నాకు

ప్రసాదింపుము. నీచే నొసంగబడిన ఆ శ్రీదేవిని - ఐశ్వర్యదేవతను నేను మనసారా ఆహ్వానించుచున్నాను. నీ అనుగ్రహమువలన ఆ లక్ష్మి సదా నా చెంతనే స్థిరముగా నుండుగాక !

ఓ౩మ్ కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా, మార్ద్రామ్ జ్వలంతీం
తృప్తాం తర్పయన్తీమ్ । పద్మే స్థితాం పద్మవర్ణాం,
తామిహోపహ్వయే శ్రియమ్ ॥ (4)

భా.అ. : ఓ సర్వైశ్వర్య దాత ! కంచువలె ప్రకాశించునదియు, సువర్ణ ప్రాకారములతో శోభిల్లునదియు, స్నేహయుక్తయు, తాను పరిపూర్ణయై యితరుల తృప్తి పరచునదియు, పద్మవర్ణముతో పద్మాసనమున అనగా స్థిరముగా నుండి శోభిల్లునదియునగు రాజ్యలక్ష్మిని చక్రవర్తి రాజ్యమును నాకు ప్రసాదింపుము.

ఓ౩మ్ చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం, శ్రియం లోకే
దేవజుష్టముదారాం । తాం పద్మనేమిం శరణ మహం ప్రపద్యే,
అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణోమి ॥ (5)

భా.అ. : ఓ జాతవేద! పరమేశ్వర ! విద్యా విజ్ఞానములతో అహ్లాదమునిచ్చునదియు, విశేష ప్రకాశము గలదియు, సర్వ లోకములందును గౌరవింపబడునదియు, ఈ లోకమున బ్రహ్మాది దేవతల (విద్వాంసుల) చేతను, మరీచ్యాది ఋషుల చేతను మన్వాది రాజన్యుల చేతను సేవింపబడినదియు, ఉదారశీలయు, పద్మ

నేమియునగు లక్ష్మిని - ఐశ్వర్యమును నేను శరణు జొచ్చుచున్నాను. - కోరుచున్నాను. ఓ లక్ష్మీ! నా దారిద్ర్యమును నశింపజేయు నిన్ను వరించుచున్నాను.

*(గమనిక : ఇచట లక్ష్మిని - ఐశ్వర్యమును చేతన దేవతగా అనగా జ్ఞానముగల స్త్రీ దేవతగా తలంచరాదు. ఐశ్వర్యము యొక్క విలువను గుర్తించి దానిని బొంద ధర్మమార్గమున పూర్ణపురుషార్థము చేయవలె నను ప్రేరణను బొందుటయే యని ఇచట గ్రహించవలెను)*

**ఓ౩మ్ ఆదిత్యవర్ణే తపసోzధి జాతో, వనస్పతి స్తవ వృక్షోzథ బిల్వః ।**
**తస్య ఫలాని తపసా నుదన్తు మా, యాన్తరా యాశ్చ**
**బాహ్యా అలక్ష్మీః ॥** (6)

భా.అ. : ఆదిత్యునివలె స్వయం ప్రకాశకుడవైన ఓ జాతవేద! పరమేశ్వర! నీ జ్ఞానమయ తపస్సువలననే సూక్ష్మప్రకృతి నుండి ఈ ప్రపంచరూప బిల్వ వృక్షము జనించుటయు, కాల క్రమమున నశించుటయు - ప్రలయమొందుటయు జరుగుచున్నది. సామాన్య బిల్వవృక్షఫలములు కూడా సూర్యతాపముచే ఎండి క్రిందపడును. అట్లే ఓ దేవ! నాలోని అవిద్యా ఆలస్య ఛల కపటాదులైన అలక్ష్మిని - పాపీ లక్ష్మిని నీ జ్ఞానతాపముచే దూరము చేయుము.

**ఓ౩మ్ ఉపైతు మాం దేవ సఖః, కీర్తిశ్చ మణినా సహ ।**
**ప్రాదుర్భూతోzస్మి రాష్ట్రేzస్మిన్, కీర్తిం వృద్ధిం దదాతు మే ॥ (7)**

ప్రసాదింపుము. నీచే నొసంగబడిన ఆ శ్రీదేవిని - ఐశ్వర్యదేవతను నేను మనసారా ఆహ్వానించుచున్నాను. నీ అనుగ్రహమువలన ఆ లక్ష్మి సదా నా చెంతనే స్థిరముగా నుండుగాక !

ఓ౩మ్ కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా, మార్ద్రామ్ జ్వలంతీం
తృప్తాం తర్పయన్తీమ్ । పద్మే స్థితాం పద్మవర్ణాం,
తామిహోపహ్వయే శ్రియమ్ ॥ (4)

భా.అ. : ఓ సర్వైశ్వర్య దాత ! కంచువలె ప్రకాశించునదియు, సువర్ణ ప్రాకారములతో శోభిల్లునదియు, స్నేహయుక్తయు, తాను పరిపూర్ణయై యితరుల తృప్తి పరచునదియు, పద్మవర్ణముతో పద్మాసనమున అనగా స్థిరముగా నుండి శోభిల్లునదియునగు రాజ్యలక్ష్మిని చక్రవర్తి రాజ్యమును నాకు ప్రసాదింపుము.

ఓ౩మ్ చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం, శ్రియం లోకే
దేవజుష్టముదారాం । తాం పద్మనేమిం శరణ మహం ప్రపద్యే,
అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణోమి ॥ (5)

భా.అ. : ఓ జాతవేద! పరమేశ్వర ! విద్యా విజ్ఞానములతో అహ్లాదమునిచ్చునదియు, విశేష ప్రకాశము గలదియు, సర్వ లోకములందును గౌరవింపబడునదియు, ఈ లోకమున బ్రహ్మాది దేవతల (విద్వాంసుల) చేతను, మరీచ్యాది ఋషుల చేతను మన్వాది రాజన్యుల చేతను సేవింపబడినదియు, ఉదారశీలయు, పద్మ

నేమియునగు లక్ష్మిని - ఐశ్వర్యమును నేను శరణు జొచ్చుచున్నాను. - కోరుచున్నాను. ఓ లక్ష్మీ! నా దారిద్ర్యమును నశింపజేయు నిన్ను వరించుచున్నాను.

*(గమనిక : ఇచట లక్ష్మిని - ఐశ్వర్యమును చేతన దేవతగా అనగా జ్ఞానముగల స్త్రీ దేవతగా తలంచరాదు. ఐశ్వర్యము యొక్క విలువను గుర్తించి దానిని బొంద ధర్మమార్గమున పూర్ణపురుషార్థము చేయవలె నను ప్రేరణను బొందుటయే యని ఇచట గ్రహించవలెను)*

**ఓ3మ్ ఆదిత్యవర్ణే తపసోఽధి జాతో, వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః ।**
**తస్య ఫలాని తపసా నుదన్తు మా, యాన్తరా యాశ్చ**
**బాహ్యా అలక్ష్మీః ॥** (6)

భా.అ. : ఆదిత్యునివలె స్వయం ప్రకాశకుడవైన ఓ జాతవేద! పరమేశ్వర! నీ జ్ఞానమయ తపస్సువలననే సూక్ష్మప్రకృతి నుండి ఈ ప్రపంచరూప బిల్వ వృక్షము జనించుటయు, కాల క్రమమున నశించుటయు - ప్రలయమొందుటయు జరుగుచున్నది. సామాన్య బిల్వవృక్షఫలములు కూడా సూర్యతాపముచే ఎండి క్రిందపడును. అట్లే ఓ దేవ! నాలోని అవిద్యా ఆలస్య ఛల కపటాదులైన అలక్ష్మిని - పాపీ లక్ష్మిని నీ జ్ఞానతాపముచే దూరము చేయుము.

**ఓ3మ్ ఉపైతు మాం దేవ సఖః, కీర్తిశ్చ మణినా సహ ।**
**ప్రాదుర్భూతోఽసి రాష్ట్రేఽస్మిన్, కీర్తిం వృద్ధిం దదాతు మే ॥ (7)**

భా.అ.: ఓ దేవ సఖా! దివ్య గుణములుగల విద్వాంసులకు, యోగులకు, పరోపకార పరులకు నీవు సదా మిత్రుడవు. అట్టి నీవు ఐశ్వర్యముతో కీర్తితో నా చెంతకు రమ్ము. నీ యఖండ రాజ్యమగు ఈ విశ్వమున ప్రాదుర్భూతుడవైనట్లే నా హృదయాంతరంగమున ప్రకటితుడవై సద్గుణములలో నన్ను వృద్ధిపరచి, కీర్తిమంతుని జేయుము.

**ఓ౩మ్ క్షుత్పిపాసామలా జ్యేష్ఠా అలక్ష్మీర్నాశయా మ్యహమ్ ।**
**అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥ (8)**

భా.అ. : హే పరమేశ్వర ! ఆకలి దప్పికలతో మలినమైన ఈ దుర్భర దరిద్రరూప అలక్ష్మిని దూరమొనర్చనేను పూర్ణపురుషార్థము చేయుదును. దయతో ఈ దారిద్ర్యమును, అభావమును నా గృహమునుండి దూరమొనర్చి నన్ను కాపాడుము.

**ఓ౩మ్ గంధద్వారాం దురాధర్షాం, నిత్యపుష్టాం కరీషిణీమ్ ।**
**ఈశ్వరీం సర్వభూతానాం, తామిహోపహ్వయే శ్రియమ్ ॥ (9)**

భా.అ.: హే జాతవేద ! పరమేశ్వర! సుగంధ ద్వారయుక్తయు, అవమానముల పాలుగాకుండ రక్షించునదియు, నిత్యము పుష్టి నొసంగునదియు, సర్వ ప్రాణులకు ఈశ్వరియు, నిత్య సుఖదాయియు నగు లక్ష్మిని నే నెల్లప్పుడు రక్షించ యత్నింతును. ఓ దేవా! అట్టి శక్తిని నాకు ప్రసాదింపుము.

**ఓ3మ్ మనసః కామ మాకూతిం, వాచః సత్య మశీమహి ।**

**పశూనాం రూప మన్నస్య, మయి శ్రీః శ్రయతాం యశః ॥ (10)**

భా.అ. : హే ఈశ్వర! నీ కృపవలన చిత్త ప్రసన్నత కలిగించు కోరికలను, సత్యభాషణాత్మకమైన వాణిని, ఆత్మజ్ఞానమును నేను బొందుదును గాక! సుందరమైన పశుసంపదను, ప్రియకరమైన అన్నమును బొందుదును గాక! నీ యనుగ్రహమున సదా నాకు ఐశ్వర్యము, కీర్తి లభించును గాక!

**ఓ3మ్ కర్దమేన ప్రజాభూతా, మయి సంభ్రమ కర్దమ ।**

**శ్రియం వాసయ మే కులే, మాతరం పద్మమాలినీమ్ ॥ (11)**

భా.అ. : ఓ జాతవేద! సర్వేశ్వర! నీచే సృజింపబడిన ఈ లక్ష్మినిబొంద నాకు ఉద్యమశీలతను బ్రసాదింపుము. అది కేవలము నా పురుషార్థముతోనే లభించదు. అందుకు నీ అనుగ్రహముకూడా అవసరము. కావున దయచేసి పద్మమువలె వికసింపజేయు తల్లి వంటి లక్ష్మిని నాకు అనుగ్రహింపుము.

**ఓ3మ్ ఆపః సృజన్తు స్నిగ్ధాని, చిక్లీత వస మే గృహే ।**

**ని చ దేవీం మాతరం, శ్రియం వాసయ మే కులే ॥ (12)**

భా.అ. : ఓ చిక్లీత ! సర్వ పదార్థ రచయిత ! అంతర్యామివైన నీవు నాలో పురుషార్థమును ప్రేరేపింపుము. ఓ దేవ! దివ్యగుణయుక్తమై నాకు గౌరవ ప్రతిష్ఠలను కలిగించు లక్ష్మిని సదా నా గృహమున

భా.అ.: ఓ దేవ సఖా ! దివ్య గుణములుగల విద్వాంసులకు, యోగులకు, పరోపకార పరులకు నీవు సదా మిత్రుడవు. అట్టి నీవు ఐశ్వర్యములో కీర్తితో నా చెంతకు రమ్ము. నీ యఖండ రాజ్యమగు ఈ విశ్వమున ప్రాదుర్భూతుడవైనట్లే నా హృదయాంతరంగమున ప్రకటితుడవై సద్గుణములతో నన్ను వృద్ధిపరచి, కీర్తిమంతుని జేయుము.

**ఓ౩మ్ క్షుత్పిపాసామలా జ్యేష్ఠా అలక్ష్మీర్నాశయా మ్యహమ్ ।**
**అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥ (8)**

భా.అ. : హే పరమేశ్వర ! ఆకలి దప్పికలతో మలినమైన ఈ దుర్భర దరిద్రరూప అలక్ష్మిని దూరమొనర్చునేను పూర్ణపురుషార్థము చేయుదును. దయతో ఈ దారిద్ర్యమును, అభావమును నా గృహమునుండి దూరమొనర్చి నన్ను కాపాడుము.

**ఓ౩మ్ గంధద్వారాం దురాధర్షాం, నిత్యపుష్టాం కరీషిణీమ్ ।**
**ఈశ్వరీం సర్వభూతానాం, తామిహోపహ్వయే శ్రియమ్ ॥ (9)**

భా.అ.: హే జాతవేద ! పరమేశ్వర! సుగంధ ద్వారయుక్తయు, అవమానముల పాలుగాకుండ రక్షించునదియు, నిత్యము పుష్టి నొసంగునదియు, సర్వ ప్రాణులకు ఈశ్వరియు, నిత్య సుఖదాయియు నగు లక్ష్మిని నే నెల్లప్పుడు రక్షించ యత్నింతును. ఓ దేవా! అట్టి శక్తిని నాకు ప్రసాదింపుము.

**ఓ౩మ్ మనసః కామ మాకూతిం, వాచః సత్య మశీమహి ।**
**పశూనాం రూప మన్నస్య, మయి శ్రీః శ్రయతాం యశః ॥ (10)**

భా.అ. : హే ఈశ్వర! నీ కృపవలన చిత్త ప్రసన్నత కలిగించు కోరికలను, సత్యభాషణాత్మకమైన వాణిని, ఆత్మజ్ఞానమును నేను బొందుదును గాక! సుందరమైన పశుసంపదను, ప్రియకరమైన అన్నమును బొందుదును గాక! నీ యనుగ్రహమున సదా నాకు ఐశ్వర్యము, కీర్తి లభించును గాక!

**ఓ౩మ్ కర్దమేన ప్రజాభూతా, మయి సంభ్రమ కర్దమ ।**
**శ్రియం వాసయ మే కులే, మాతరం పద్మమాలినీమ్ ॥ (11)**

భా.అ. : ఓ జాతవేద! సర్వేశ్వర! నీచే సృజింపబడిన ఈ లక్ష్మినిబొంద నాకు ఉద్యమశీలతను బ్రసాదింపుము. అది కేవలము నా పురుషార్థముతోనే లభించదు. అందుకు నీ అనుగ్రహముకూడా అవసరము. కావున దయచేసి పద్మమువలె వికసింపజేయు తల్లి వంటి లక్ష్మిని నాకు అనుగ్రహింపుము.

**ఓ౩మ్ ఆపః సృజన్తు స్నిగ్ధాని, చిక్లీత వస మే గృహే ।**
**ని చ దేవీం మాతరం, శ్రియం వాసయ మే కులే ॥ (12)**

భా.అ. : ఓ చిక్లీత ! సర్వ పదార్థ రచయిత ! అంతర్యామివైన నీవు నాలో పురుషార్థమును ప్రేరేపింపుము. ఓ దేవ! దివ్యగుణయుక్తమై నాకు గౌరవ ప్రతిష్ఠలను కలిగించు లక్ష్మిని సదా నా గృహమున

వసింపజేయుము. హే జాతవేదేశ్వర! నీ కృపవలన నా ప్రాణశక్తులు కర్మలు నాకు స్నేహ యుక్తమైన వస్తు సంపదలను ప్రాప్తింప చేయును గాక !

**ఓ3మ్ ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్ ।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (13)**

భా.అ. :హే ఈశ్వర! పరస్పర ప్రేమను పెంచునదియు, పుష్కరిణీ వలె శోభిల్లునదియు, పుష్టి రూపిణియు, శోభన వర్ణయు, స్వర్ణ రత్నాది మాలాయుక్తయు, సూర్యతేజస్సుతో హిరణ్యమయియైన సులక్షణయుక్త ఐశ్వర్య లక్ష్మిని నాకు ప్రసాదింపుము.

**ఓ3మ్ ఆర్ద్రాం యః కరిణీం యష్టిం, పింగలాం పద్మమాలినీమ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (14)**

భా.అ. : ఓ జాతవేద! స్నేహయుక్తయు, సువర్ణాది ధాతువులతో యశస్సు నిచ్చునదియు, రథములు, నివాసస్థానములు స్వర్ణ స్తంభములతో శోభిల్లునట్టియు, పింగళవర్ణయునగు రాజ్యలక్ష్మిని నాకు ప్రసాదింపుము.

**ఓ3మ్ తాం మ ఆవహ జాతవేదో, లక్ష్మీ మనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో, దాస్యోఽశ్వాన్**
**విందేయం పురుషానహమ్ ॥ (15)**

భా.అ. : ఓ జాతవేదేశ్వర ! నా ప్రార్థనను మన్నించి పైన వర్ణించిన సులక్షణయుక్త సుఖప్రదాయనియగు లక్ష్మిని - ఐశ్వర్యమును నాకు ప్రసాదింపుము. హే పరమేశ్వర స్వామిన్ ! నీ కృపవలన గో అశ్వ దాస దాసీ జనములను, పెక్కురు సన్మిత్రులను, అపార స్వర్ణ రత్న రజితాదులను నేను బొందుదును గాక !

**ఫలస్తుతి**

**ఓ3మ్ యః శుచిః ప్రయతో భూత్వా, జుహుయాదాజ్య మన్వహమ్ ।**
**శ్రియః పంచ దశర్చం చ, శ్రీకామః సతతం జపేత్ ॥ (16)**

భా.అ. : ఎవరు బాహ్యాభ్యంతరములందు శుచులై అత్యంత ప్రీతితో పై మంత్రములతో పరమేశ్వరుని బ్రార్థించుచు ఘృతాదులతో అగ్నియందు నాహుతుల నొసంగుదురో అట్టివారికి పై వర్ణించిన సిరిసంపదలు లభించును. అర్థభావనతో పై పదునైదు మంత్రములతో సదా పరమేశ్వరుని ప్రార్థించు అనన్య భక్తులకు కూడ ఐశ్వర్యశ్రీ లభించును. వారి ధర్మయుక్త కోరికలన్నియు నెరవేరును.

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

వసింపజేయుము. హే జాతవేదేశ్వర! నీ కృపవలన నా ప్రాణశక్తులు కర్మలు నాకు స్నేహ యుక్తమైన వస్తు సంపదలను ప్రాప్తింపజేయును గాక !

**ఓ౩మ్ ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్ ।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (13)**

భా.అ. :హే ఈశ్వర! పరస్పర ప్రేమను పెంచునదియు, పుష్కరిణీ వలె శోభిల్లునదియు, పుష్టి రూపిణియు, శోభన వర్ణయు, స్వర్ణ రత్నాది మాలాయుక్తయు, సూర్యతేజస్సుతో హిరణ్మయియైన సులక్షణయుక్త ఐశ్వర్య లక్ష్మిని నాకు ప్రసాదింపుము.

**ఓ౩మ్ ఆర్ద్రాం యః కరిణీం యష్టిం, పింగలాం పద్మమాలినీమ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం, జాతవేదో మమావహ ॥ (14)**

భా.అ. : ఓ జాతవేద! స్నేహయుక్తయు, సువర్ణాది ధాతువులతో యశస్సు నిచ్చునదియు, రథములు, నివాసస్థానములు స్వర్ణ స్తంభములతో శోభిల్లునట్టియు, పింగళవర్ణయునగు రాజ్యలక్ష్మిని నాకు ప్రసాదింపుము.

**ఓ౩మ్ తాం మ ఆవహ జాతవేదో, లక్ష్మీ మనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో, దాస్యోఽశ్వాన్**
**విందేయం పురుషానహమ్ ॥ (15)**

భా.అ. : ఓ జాతవేదేశ్వర ! నా ప్రార్థనను మన్నించి పైన వర్ణించిన సులక్షణయుక్త సుఖప్రదాయనియగు లక్ష్మిని - ఐశ్వర్యమును నాకు ప్రసాదింపుము. హే పరమేశ్వర స్వామిన్ ! నీ కృపవలన గో అశ్వ దాస దాసీ జనములను, పెక్కురు సన్మిత్రులను, అపార స్వర్ణ రత్న రజితాదులను నేను బొందుదును గాక !

## ఫలస్తుతి

**ఓ౩మ్ యః శుచిః ప్రయతో భూత్వా, జుహుయాదాజ్య మన్వహమ్ ।**
**శ్రియః పంచ దశర్చం చ, శ్రీకామః సతతం జపేత్ ॥** (16)

భా.అ.: ఎవరు బాహ్యాభ్యంతరములందు శుచులై అత్యంత ప్రీతితో పై మంత్రములతో పరమేశ్వరుని బ్రార్థించుచు ఘృతాదులతో అగ్నియందు నాహుతుల నొసంగుదురో అట్టివారికి పై వర్ణించిన సిరిసంపదలు లభించును. అర్థభావనతో పై పదునైదు మంత్రములతో సదా పరమేశ్వరుని ప్రార్థించు అనన్య భక్తులకు కూడ ఐశ్వర్యశ్రీ లభించును. వారి ధర్మయుక్త కోరికలన్నియు నెరవేరును.

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

గీతామృతం, వైదిక వైజ్ఞానిక సంస్కృతి, మానవ ధర్మము, గాయత్రీ మహిమ వైదిక క్రాంతి పథం, చతుర్దశ భువనములు, అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము, యజ్ఞోపవీత వైశిష్ట్యము, జననీ - జన్మభూమి, ద్రౌపదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ), యుగపురుషుడు శ్రీకృష్ణుడు, పురుషోత్తముడు శ్రీరాముడు, మహర్షి మనువుపై విరోధమెందుకు?, వేదములలో విజ్ఞాన బీజాలు, ధర్మవీర పం. లేఖరాం, వైదిక వివాహ వైశిష్ట్యము, అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ, మాతా పుత్రికల జ్ఞాన చర్చ, బ్రహ్మచర్య విజ్ఞానము, వైదిక అర్థనీతి, దయానందుని ఆదర్శ రాజ్యము, వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి, వైదిక అగ్ని హోత్ర విధి , ది గ్రేట్ గాయత్రి, శాంతి ప్రార్థన, చాణక్యనీతి, శ్రీ దయానంద హృదయము, ప్రణవ స్తోత్రమ్, శ్రీమతి లక్ష్మీదేవి ప్రేరణాత్మక జీవనం

---

వ్యవస్థాపకులు :

డా॥ కోడూరి సుబ్బారావు

తపాల ద్వారా ప్రతులకు

1. శ్రీ బాసెట్టి సత్తయ్య ,జె-38, రాంగోపాల్‌పేట్,
సికింద్రాబాద్ - 500 003.

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.
2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3–3–736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.
ఫోన్ : 781 2904 / 6320200
3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111
(నిజామాబాద్ జిల్లా)
4) వైదిక సాహిత్యభండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

గీసూత, వైదిక వైజ్ఞానిక సంస్కృతి, మానవ ధర్మము, గాయత్రీ మహి
వైదిక క్రాంతి పథం, చతుర్దశ భువనములు, అగ్ని హోత్ర వైజ్ఞా
స్వరూపము, యజ్ఞోపవీత వైశిష్ట్యము, జననీ - జన్మభూమి, దౌహ్య
(ఋషులదృష్టిలో గర్భచికిత్స), యుగపురుషుడు శ్రీకృష్ణుడు, పురుషోత్తము
శ్రీరాముడు, మహర్షి మనువుపై విరోధమెందుకు?, వేదములలో విజ్ఞా
బీజాలు, ధర్మవీర పం. లేఖరాం, వైదిక వివాహ వైశిష్ట్యము, అక్కాచెల్లె
ధార్మిక చర్చ, మాతా పుత్రికల జ్ఞాన చర్చ, బ్రహ్మచర్య విజ్ఞానము, వైది
అర్థనీతి, దయానందుని ఆదర్శ రాజ్యము, వైదిక సంధ్యాగ్ని హోత్ర వి
వైదిక అగ్ని హోత్ర విధి, ది గ్రేట్ గాయత్రి, శాంతి ప్రార్థన, చాణక్యనీ
శ్రీ దయానంద హృదయము, ప్రణవ స్తోత్రమ్, శ్రీమతి లక్ష్మీదే
ప్రేరణాత్మక జీవనం

---

వ్యవస్థాపకులు :

డా॥ కోడూరి సుబ్బారావు

తపాల ద్వారా ప్రతులకు

1. శ్రీ బాసెట్టి సత్తయ్య ,జె-38, రాంగోపాల్‌పేట్,
సికింద్రాబాద్ - 500 003.

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3–3–736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.
ఫోన్ : 781 2904 / 6320200

3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111
(నిజామాబాద్ జిల్లా)

4) వైదిక సాహిత్యభండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.